సాంగముగా శైవములకు, భంగిన వేదాంతములకు బ్రహ్మాదులకున్
లింగస్వరూపవిరహిత, గంగాధరరూప మీ[యు]గంగాం దలమగునే. ౨౫౫

వనజాననపద్మజోదర, సనకాదులు ముఖ్యబాహ్యసంత్యాగము సే
సినవారు గారు తక్కటి, [1]పిను(గులు బాహ్యంబు విడిచి పెద్దయు( జెడరే.

స్థిరముఖ్యబాహ్యపూజా, కరణము లేదయ్యెనేని గౌణకృతాభ్యం
తరవిధి నైనను భక్తిం, బరమేశ్వరు( గొలువకునికి పాపము గాదే. ౨౫౬

పర[మ]హితయత్నోక్తాభ్యం, తర[2]పూజను విడిచి యేన దైవము నని దె
ప్పర మగునాస్తిక్యమతిన్, హరు( గొలువనినరు(డు పతితు( డన(బడుజగతిన్.

అవికల దేవామరవర, నివహసదాపూజనీయనిత్యోత్సవన
చ్ఛివలింగవరాఙ్ముఖమూ, నవసంభాషణము లెల్ల నరకార్థ మగున్. ౨౫౭

బాహ్యపూజ చేయవలయును.

ఒడలు గుడి యంతరాత్మయు, బడరుం డనుపలుకు లుడిగి భక్తిని గుడియే
గుడి[యుని యు]లింగమూర్తి[యు], బడరుం డని కొలువకునికి పాతకము శివా.

వేదోక్తవిహితకర్మము, హా దేవార్చనవిహీను( డగుపాషండిం
గా నెదురు( జూడ( జూచిన, యాదోషము వో(వ( జూచునది భక్తులకున్.

శివసమయంబున [3]కెక్కరెడు, నవినీతుల రెంత పెద్దలైనను మ్రొక్కన్
శివభక్తులకును ద[గద], క్కువిచారుల మ్రొక్కు [లెపుడు]గొన( గాదు శివా.

కా దవ్వు(గొన(గ నవ్వ(, గా దీ( గొన( గాదు గాదు కన( దమలో నా
ల్లాపమున( బలుక( గాదు మ, హాదేవపరాఙ్ముఖాత్ము లగుపతితులతోన్.

కాదు సమశయ్య(() బొందం, గాదు సమాసనముసందు( గదియ( [4]జరింపం
గాదు వహా[5]వాసమును మ, హాదేవపరాఙ్ముఖాత్ము లగుపతితులతోన్. ౨౬౪

చేతోజాతవిమర్దన, భాతిగ నిను( గొలువనట్టిపాలసునకు సం
ప్రీతిని గుడువం బెట్టిన, దాతకు యమదండనంబు( దప్పదు రుద్రా. ౨౬౫

. . . . . . . . . . . నించుక లేని నాస్తికస్థితివిషయా
ధీనదురాచారికి నెయ్యా, జ్ఞానందము గలుగ నేర్చునయ్య మహేశా. ౨౬౬

కా దతని వేడి కుడువం, గా దతనికి(() గుడువ( బెట్ట( గాదు భజింపం
గా దీ( గొన దానమును మ, హాదేవపరాఙ్ముఖాత్ము లగుచరితులతోన్. ౨౬౭

---

1. బరుంగులు. 2. తరపూజనముడిచియేనన్దైవమనని. 3. గడకెడు. 4. జదింపక. 5. వాసమును నుమహా.

శివతీర్థములో నొందెను [1]శి, వాజ్ఞతో నొందె[(దాను]జీవత్యాగం
బు విధించినమానవుఁడును, భవత్ప్రసాదమున ముక్తిఁ బడయు మహేశా.

చచ్చిన శివభక్తునకుఁ బరలోకవిధులు వలదు.

ఎందును శివార్థముగ మృతిఁ, బొందినపుణ్యాత్ము[2]బంధుపుత్త్రాదులకుఁ
బొందదు సూతక మతనికి, వందురి పరలోకవిధులు వలదు మహేశా. ౨౮౨
వెండియు శివార్థమృతునికి, నొండొకపరలోకవిధులు నొనఁబడి రే నా
రొండుడిగి యథాశక్తిం, బండుగ సేయుదురు రుద్రభక్తులకు శివా. ౨౮౩
పితృలోకవిష్ణులోకము, లతిక్రమించి శివపురికి నరిగెడుభక్త
ప్రతతికిఁ బితృమేధక్రియ, లతిశయముగఁ జేయునాతఁ డజ్ఞుఁడు రుద్రా. ౨౮౪
అంతకరిపుభక్తుని దే, హాంతంబున నతనియర్థ మాగముయుక్తిన్
సంతతి గలిగినఁ దత్పశు, సంతతి కీఁదగదు శైవసంతతి దక్కన్. ౨౮౫

శివాపచారులకు శిక్ష.

సకలామరదైతేయ, ప్రకరసదారాధ్యమానపాదాబ్జభవాం
తక నీభక్తులదుర్గుణ, శకలంబుల వెదకువాఁడు చండాలుఁ డజా. ౨౮౬
శివ నిన్నును వేదములను, శివభక్తుల బ్రాహ్మణులనుఁ జెనసాడెడుపు
ణ్యావిహీనుఁ డధోగతిఁ బడి, యనింళనరకాగ్ని [4]బాధలందు మహేశా.
శివభక్తులఁ జెడనాడెడు, నవినీతుఁడు ఘోర రౌరవాగ్నులఁ బడి [3]శీర్యా
రవితారకమును గాలుచు, భ్రమముగ వాచఱచు మండు మరి తొరాతి. ౨౮౭
[5]వెఱవక నీగుడిలోపల, గుఱుకొని యాలాపువెట్టుకొని యుండెడిపా
దటి జముదూతలు గుక్కలఁ, గ(ఱ)పింతురు మూఁటకట్టు గట్టి మహేశా.
ప్రమదాసంగతి చేసిన, సుమిసిన ము(ఱి)కాల్లు సాఁచియుండిన శివగే
హములోనఁ జూదమాడిన, నమితమహానరకబాధ లందు మహేశా. ౨౮౯
పావలు(ఁ) జెప్పులు దొడుకొని, దేవ శివాలయములోనఁ ద్రిమ్మ(ఱు పాపుల్
వా విడిచి నిగళబంధము, తో వాచఱచుచు[ను] గాలుదురు నరకాగ్నిన్.
కుడిచిన నీళ్లాడిన ము(ఱి), గుడిలోపల నలు(ఁ)గువెట్టుకొన్న [7]నభీష్టం
బడఁగ(గ] నిప్పిన దుర్గతి(ఁ), బడుదురు బాధలను నధికపాపాత్ము లజా.
గుడిలో ముద్దట లడిచిన, గుడిలో వెంద్రుకలు వాచికొనినను నెపుడుం
గడు వె(ఱ)వక విహరించిన, గడునరి నరకాగ్నిశిఖలఁ గాలు మహేశా. ౨౯౧

1. శివజ్ఞాలో. 2. త్రిందిపుత్త్రా. 3. ఫురికరిగాడు. 4. బాధలందుదురు మహేశా. 5. యా. 6. వెఱువక. 7. అభీష్టం.

అతిగర్వోదాసీనత, గతభయులై శివ! శివోపకరణద్రవ్య
1ప్రతతులుగాళ్లందన్నిన, నతకడచినద్రోహి రౌరవాగ్నులఁ గాలున్.
2మృడ నీతోఁటలపువ్వులు, ముడిచిన మఱిగానిఁ గోసి మూర్కొన్నసరుల్
కడుఁ గాఁగినసూదుల[తోఁ], వడవఁగఁబడి నరకబాధ లందుదురు శివా.
3శివ నీతోఁటలలోపల, శివగృహములలోననొండె శిశమున 4మూత్రా
ద్యపకార్యంబులు చేసిన, యవినీతుఁడు ఘోరరౌరవాగ్నులఁ గాలున్.
ఉత్తమకులవిద్యాగుణ, 5విత్తోద్యోగాదిసకలవిషయము లెల్లన్
6రిత్తయ బుద్ధిఁ దలంప ను, దాత్తభవద్భక్తి లేనియధములకు శివా. ౨౯౭
కులమునఁగలిమియుఁ బ్రాయము, గలిగియుమఱి ముక్కు లేనికాంతయుపోలెం
గులమును గలిమియుఁ బ్రాయము, గలిగియు శివభక్తి లేనికష్టుఁడు రుద్రా.
శ్రీరమణార్చిత దురితని, వారణ నీభక్తి లేని7వారల విద్యా
చారకులరూపసంపద, లారయఁగా నిష్ఫలంబు లన్నియు రుద్రా. ౨౯౯

## దక్షాధ్వరధ్వంసము.

సురమునివైదికమతను, స్థిర[ముగ]ద[క్షు]ప్రజాపతి యొనర్చినవి
స్తరసత్త్రియ దేవభవ, ద్విరహితముగఁ జేసికాదె విఫలత నొందెన్. ౩౦౦
వేదములు ప్రమాణములుగ, నాదిన యొడఁబడియు వాని నతికడచి భవ
త్వాదనుతి విడిచి 8చెడియెను, పాదరి దక్షుండు వీరభద్రునిచేతన్. ౩౦౧
అలరినయె శివుఁ బలికిన, పాలనుఁ డని కినిసి వీరభద్రుఁడు ఫాలా
ఖీలవిలోచనదహన, జ్వాలల మును దక్షుజన్నసాలను గాల్చెన్. ౩౦౨
9భూతములు దర్భత్రాళ్లను, హోతల మెడ లంటఁ గట్టి యూపంబులతోఁ
త్రేతాగ్నులు యాగాశ్వము, భూతేశ్వర గంగలోనఁ బోవైచె నజా. ౩౦౩
అమిషము(ం) గొని రుద్రుని, రోమజగణపతులు చరుపురోడాశమహా
హోమద్రవ్యము లెల్లను, నీమహిమం జేసి దక్షునిం జె(ఱ)చి రజా. ౩౦౪
ధర్మాదిసదస్యులు శివ, ధర్మ10విహీనుండు నైనదక్షునిసభలో(ఁ)
బేర్చిచెడి భూతములచే, దుర్మదులై కొట్టువడిరి దురితారాతీ. ౩౦౫
ఎలుకల నడచినవిధమున, నలయుక దక్షాధ్వరమున కనివచ్చినసా
ధుల మునుల నడిచి చంపిరి, గలహంబునఁ బెరిఁగి ప్రమథగణములు రుద్రా.

1. ప్రతతులంగాళ్లం. 2. మృడునితోంటల. 3. శివునితోంటల లోపలి. 4, మూత్రోద్యపకార్యం. 5. విత్తోద్యోగాది, 6. రిత్తనియబుద్ధి. 7. వారలు. 8. చెడియును. 9. భూతములును. 10. విహీనుండైన.

కలియుగమునఁ జోరులచే, బలిమిఁ గులస్త్రీలు వడ్డభంగిన హర నీ
కలుషమున నమరవనితలు, వెలయంగాఁ జెడిరి భూతబేతాళురచేఁ. ౩౦౭

[1]గోకులమును గోపాలకుఁ, డాకులమునఁ [2]దోలునట్టు లమరుల నెల్లం
జేకోనక తోలి సంపె ను, హాకోపుఁడు వీరభద్రుఁ డతిబలుఁడు శివా. ౩౦౮

మారారిద్రోహునింటికి(ఁ), బేరంటమువచ్చి తనుచుఁ బెలుచను గోసెఁ
వైరమున నదితిముక్కును, భారతి[3]నాసికయు వీరభద్రుఁడు రుద్రా. ౩౦౯

ఆలరిదక్షునినోమున, కేలా చనుదెంచి తనుచు నీశానదిశా
. . . . . . . . . . . . ౩౧౦

నిష్ఠురముగఁ బ్రమథగణ, ప్రష్ఠుండై నెగడువీరభద్రుఁడు దారా
జ్యేష్ఠునిఁ జంద్రునిఁ బాదాం, గుష్ఠంబున ధరణిఁ బ్రామెఁ గోపమున శివా.

[4]దక్షుశిరంబును రణజయ, శిక్షావిధి యజ్ఞపురుషుశిరమును [5]దునిమెఁ
దక్షాధ్వరంబులోఁ బ్రతి, పక్షక్షయకారి వీరభద్రుఁడు రుద్రా. ౩౧౨

వడి మృగరూపము(ఁ) గైకొని, చెడిపా(ఱ)డుయజ్ఞపురుషుశిరము దెగఁ ద్రె
ళ్ళిడిలోన నేసి చంపెనుఁ, గడువీరుఁడు వీరభద్రగణనాథుఁ డజా. ౩౧౩

స్వాహాపతిభామిని యగు, స్వాహాంగనముక్కు నెడమచనుమొనయుఁ దగఁ
సాహసముతోడఁ జిదిమిన, బాహుబలం బొప్పె వీరభద్రునకు శివా. ౩౧౪

స్వాహాపతి[6]జిహ్వ శివ, ద్రోహునిజన్నమున నాహుతులు గొన్నది[7]యఁ
ద్రోహమునఁ గోసివైచెను, బాహుబలుం డైనవీరభద్రుఁడు రుద్రా. ౩౧౫

పోలఁగదక్షుఁడు సత్క్రియ, మేలని చేయుటకు నశ్వమేధము గీడై
కోలాహల మయ్యెఁ గ్రియలు, సాలఁగ శివభక్తిలేకసహజము లగునే. ౩౧౬

కర్మఫలదాత త్రిజగ, న్నిర్మాతమహేశ్వరుండు నిఖిలపశు[8]త్రా
తన్ముల కధిపతియనిక్రియ, [9]లిమ్ములఁ జేయునది మనుజు లీశ్వరభక్తిఁ. ౩౧౭

ఆహరిసురేంద్రముఖ్యను, ధావాదుల [10]నెల్ల నిట్టు లత్యుద్ధతిమై
దేహములు గోసివైచిన, బాహుబలం బొప్పె వీరభద్రునకు శివా. ౩౧౮

ఆహవమున[ందుఁ][11]దెగి[య], య్యాహవనీయాగ్నిఁ బడియె నట విష్ణుశిరం
బాహా నీకింకరునకు, బాహుబలం బొప్పె వీరభద్రునకుశివా. ౩౧౯

---

1. గోకులమునం. 2. దోలునట్లుమరుల. 3. నాసికము. 4. దక్షునిశిరంబును. 5. మేసుఁ. 6. జిహ్వయు. 7. యును. 8. ప్రాతమ్ముఁల. 9. లిమ్ముఁల. 10. నెల్లనిట్లుత్యుద్ధతి. 11. దెగియా.

### ప్రళయవర్ణనము - గణాధిపులయాటలు.

కర్మక్షయంబు గామిని, నిర్మలమోక్షంబు లేమి నిఖిల[1]పశువ్రా
తమ్ములదుఃఖంబులు గని, నిర్మింతు లయంబు గొంత [2]నిర్వృతికి శివా. 3౨౦
కరుణా[3]కరుఁడవు గావున, విరచితబహుజీవరాశి[4]విశ్రమహేతు
స్థిరమలనిఖిలజగత్సం, హరణము గావింతు కరుణ [5]నతిమహిమ శివా. 3౨౧
ప్రమథులు రుద్రులు[మఱి][6]భూ, తము లనఁగాఁ ద్రివిధ[7]మూలదళములతోఁడన్
సమసుప్తి[8]నాథ నీగణ, సమూహములు సంహరించు జగములు రుద్రా. 3౨౨
కుమ్మరి దరిగొల్చినఁ[9]చి, చ్చిమ్ముల నావంబుకడప లెల్ల [10]దరికొనం
గ్రమ్ముగతి నజాండంబులఁ, బ్రస్ఫు భవన్నేత్రవహ్ని ప్రళయమున శివా. 3౨3
భవదుద్భటనిటలేక్షణ, భవజ్జృంభితనిటలవహ్ని పర్వి జగద్వి
ప్లవహేతు వయ్యెఁ బ్రమథుల, కవిరళసుఖహేతు వయ్యె నదియె మహేశా.
లోకంబులు ప్రళయాగ్నిశి, ఖాకలితములై తదగ్నిఁ గాలఁగ(ఁ) [11]బ్రమథా
నీకములు వెరి(ఁ)గి యాడుచు, హాకొయుదిఁ దేలియాడునట్లు మహేశా.
త్ర్యంబక నీప్రమథగణా, డంబరవిభవంబు గడు నోడంబడ సంహా
రంబు[ను]వర్ణన సేయఁగ, లంబోదరషణ్ముఖాదులకు నరిది శివా. 3౨౬
ససముద్రద్వీపాచల, వసుమతి వడి మీఁది [12]కెగురవైచి ససక్షు శివా.
త్రసురావాసా[13]కాశము, వెసఁ గ్రిందికిఁ దిప్పుచుఁ బ్రమథవిభుఁ డొకఁడు
కడు మండెడుబడబాగ్నిం, [14]దవళపుక పడిఁ గూడఁ దిగిచి తననుదుటను బొ
ట్టిడికొని యానందంబున, వెడ సోలుచు నాడుఁ బ్రమథవిభుఁ డొకఁడు శివా.
సకలసముద్రజలంబులు, నొకగణనాయకుఁడు ద్రాగి [15]హొబ్బని త్రేన్చున్
సకలగ్రహతారకములు, నొకగణనాయకుఁడు నాఱ నూఁదు మహేశా.
ద్వీపము లేడును జక్ర, వ్యాపార[16]విధమునఁ ద్రిప్పి వైతురు హా[ఱ]న్
నీపంపునఁ గొందఱు బహు, రూపులు గణనాయకులు విరూపాక్ష శివా.
యమమహిషశృంగములు నిం, ద్రమహాగజదంతములుఁ బ్రతాపముతోడన్
సమసుప్తి దున్సికొని నీ, ప్రమథులుఁ దాలములు వేసి పాడుదురు శివా. 33౧
పడ వేసిమృత్యు[17]దేవత, మెడ[18]మడమలఁ ద్రొక్కి దాని[19]మెఱసెడికో(ఱ)ల్
వడిఁ బెఱికికొనిమహోల్కా, ఘము, లుడుగక త్రిప్పుక్రియఁ ద్రిప్పునొకగణము శివా.

1. పశువ్రాతమ్ములు. 2. నివృత్తికిని. 3. కరుణావు. 4. విక్రమ. 5. నతిమహిమ. 6. భూతలములనంగా. 7. ద్రివిధమూలంబ్రానముతోడన్. 8. నాథునిగణ. 9. చిచ్చుమ్ముల. 10. దరికొనం. 11. బ్రమథాని. 12. కెగర. 13. కాసము. 14. దడయకంపడి. 15. హొబ్బని. 16. విధమునను. 17. దేవర. 18. మండం. 19. మెఱవెడికోఱల్.

వరుణునిమకరము వాయువు, హరిణముఁ గడిచేసి మ్రింగి యానురముగ ది
క్కరులం దిని త్రేఁచును శం, కర నీగణనాథుఁ డొకఁడు [1]గడికాఁడు శివా.
కొంద(ఱు)గణపతు లత్త(ఱి), మందరహిమవత్ప్రధానమహితమహీభృ
త్సందోహంబులుఁ గొని కడు, నందముగా నూడుపట్టె లాడుదురు శివా.
సురపర్వతాదిధరణీ, ధరకందుకకేళి సలిపి తత్క్షణమున [2]న
గ్గిరులు వొడిచేసి చల్లుచు, నరుదుగ గణపతులు గొంద(ఱా)డుదురు శివా.
పూని వడిఁ దిగిచి యష్టను, హానాగమ్ములను [3]మిద్దియలుగా ప్రేళ్లక
మూనుగఁ గొంద(ఱు)దాల్తురు, వానిఫణామణులరుచులు[4]వఱ్ఱుగఁ బ్రమథుల్.
ఆదివరాహము వె(రిఁ)గిన, యాదంష్ట్రలు వె(ఱి)కి [5]తననిజాస్యంబున సం
పాదించికొని నటించు మ, హాదర్పముతోడ నొకగణాధిపుఁడు శివా. 332
మ(ఱి)యాదికూర్మపృష్ఠము,దొ(ఱ)యఁగవడి(ఁ)బొడిచి[6]యందుఁదూర్చి ఫణీంద్రుక
నెఱిఁ ద్రిప్పటముగఁ ద్రిప్పుచు, నఱలఁగ గణనాథుఁడొకఁడు వడి నాడు శివా.
నరసింహునికంఠంబును, నరుణజటాకేసరంబు లంబికసాదాం
బుదహామణిపీఠమునఁ బొ, ల్పరుదుగ రచియించు నొకగణాధిపుఁడు శివా.
ప్రమథాధిపతులుఁ గొంద(ఱు), కొమరుగ నొడ్డణము దండ గ్రుచ్చి[న]భంగిక
హిమకరమండలమును [7]సూర్యమండలము దండ గ్రుచ్చి యాడుదురు శివా.
[8]నుఱుమైప(ఱి)యలు వా(ఱ)ఁగ, న(ఱ)చేత నజాండభాండ మవియఁగ ప్రేయక
మఱిబ్రహ్మ యేఁడియనుచు[ను], నఱలఁగగణనాథుఁడొకఁడు వడి వెదకుశివా.
వారిజభవునికపాలము, గోరి [9]త్రివిక్రమునివీఁపుకో లెమ్ముతుదిం
జారుగతి నిలిపి ఛత్త్రా, కారంబుగఁ దాల్చి యాడు గణనాథుఁ డజా. 334
చరణం[బులుఁ]జరణంబులుఁ, గరములుఁగరములునుఁ [10]బెనఁచి కంఠమున గణే
శ్వరుఁడొకఁడుదాల్చియాడును, విరించి[11]విష్ణులసబములు విలయమున శివా.
వడి నిడుపుగఁ బెరు(ఁ)గుదు ర, ప్పుడ [12]నిడు పుడిగించి గుజ్జుఁ బొడవగుదురు వీ
డ్వడి వలుదత్రుంగు లొల్లక, కడుసన్నము లగుదు రిట్లు గణములు రుద్రా.
[13]పెగడుగ వసురుద్రాది, త్యగణేశసమస్తదేవతారాక్షసప
న్నగగణములన్నియునుఁ జెడి, గగనంబంతయును బ్రమథగణమయ్యెశివా.

1. గతికాఁడు. 2. నగిరులువడిచేసి. 3. ముదియలుగా ప్రేళ్ల. 4. దఱుఁగం. 5. తనని జాస్యంబుగ. 6. యందుగూర్చి. 7. సూర్యమండలమును. 8. నుఱిమై. 9. త్రివిక్రమును. 10. బెనచి. 11. విష్ణులశబములు. 12. నిడుపుడిగించుకొని గుజ్జు. 13. పెగండగ.

అడుదుకు 1జతలు వెట్టుచు(c), బాడుదురు[ౕ] గతులుచేసి పరమానంద
క్రీడానంగతిఁ బ్రమథులు, కూడి వినోదింతు రిట్లుఁ గోమరుగ రుద్రా. 3౪౭
లోకాలోకము సురపతి, లోకముతోఁ గూడి బ్రహ్మలోకము(త్రి)యా
వైకుంఠలోకమునుఁ జెడి, లోక2త్రయ మెల్లఁ బ్రమథలోకం బయ్యెన్. 3౪౮

శివగణవర్ణనము.

ప్రమథగణంబు లసంఖ్యా, తము లీశ్వర యెఱుఁగ వ్రేఁగు దత్సంఖ్యలు వే
దములు3"నసంఖ్యాతా"యని, యమరఁగ ఘోషించుచున్న యవి గడ లేమిన్.
సకలకులపర్వతంబులు, నకుటిలగతి గ్రుచ్చి కంఠహారముగా 4నొ
క్కొకమాటు భవద్గణనా, యకుండుఁ[దాఁ]దాల్చుఁ బర్వతాభరణుఁ డజా.
పరివిలయ5వేళ మేరువుఁ, బరిమార్చుటఁ జేసి 6మేరుపాతనుఁ డనఁగా
బర(c)గిన7గణనాయకుఁ డొక(c), డరుదెవ్వరికైనఁ బొగడనక్కజుఁడు శివా.
ఒండేమి సమస్తబ్ర, హ్మాండంబులుఁ బూసపేరులై యుండఁగ ను
ద్దండగతి గ్రుచ్చి యాడఁగ, నండాభరణుఁ డన నెగడె నలిబలుఁడు శివా.
వెండి హరిబ్రహ్మాదుల, రుండము లాభరణములుగ . . . . .
రుండాభరణుఁడు నా నధి, కుండు భవద్గణవిభుండు గురుభుజుఁడు శివా.
వెండియు నానాకారులు, వెండియు నానాప్రతాపవిక్రమవిభవుల్
దండితదైత్యేంద్రులు వర, గొండప్రియ నీగణములు గొంద(ఱు) రుద్రా.
లాలానురవక్షస్స్థల, కీలాలజలప్రవాహకేళీలోలా
భీలత్రిశూలహస్తులు, 8హాలహలాంకులు భవద్గణాధిపులు శివా. 3౫౩
రాజార్ధధరులు నరసుర, రాజామరభయులు రాజరాజసఖులు నో
రాజపతాకులుఁ గేశవ, రాజప్రియ నీగణములు 9రాజాభరణా. 3౫౫
బ్రహ్మాభివంద్యముఖ్యులు, బ్రహ్మకపాలావళీ10విరాజితులు పర
11బ్రహ్మాకారులు . . . , బ్రహ్మేశ్వర నీగణాధిపతులు కపర్దీ. 3౫౬
శ్రీరమణులు సకలజయ, శ్రీరమణులు వేదశాస్త్ర12శివతత్త్వవిదుల్
శ్రీరాలప్రియ భోజను, హారాజప్రియ 13భవద్గణాధిపులు శివా. 3౫౭
14వివిధాబ్ధిమహాజలధర, రవులు గణేశ్వరులు మలయరాజప్రియ . . .
. . . , . గొంద(ఱు), భువనత్రయసుందరులుఁ ద్రిపురదహన శివా. 3౫౮

1. జెతులు. 2. త్రయం బెల్ల. 3. నసంఖ్యాతా. 4. నొక్కొక్క. 5. వేళ మేరువు. 6. మేలం పాతనుండు. 7. గణనాయకుఁ డరుదేవురికైన. 8. హాలాహలాంకులు. 9. రాజరాజాభరణా. 10. విరాజితులు. 11. బ్రహ్మాకారులు. 12. శివతత్త్వవిదుల్. 13. భవద్గణాధిపుంగవులు. 14. వివిధాబ్ధి.

శ్రీశ్రీదిగంబరులు నా, క్ష్మీశ్రితమహిములు జగత్ప్రసిద్ధులు భక్తి
శ్రీశ్రితహృదయాంభోజులు, శ్రీశ్రిత నీ[1]గణము లెవ్వ డజేయులు రుద్రా.
లంబోష్ఠలంబనాసిక, లంబోదరలంబనేత్రలంబశ్రవణుల్
లంబహనులంబజిహ్వులు, నంబాప్రియ నీగణాధినాయకులు శివా. ౩౬౦
అజకర్ణు లశ్వకర్ణులు, [2]గజకర్ణవరాహకర్ణఘంటాకర్ణుల్
త్రిజగద్రమణీయులుఁ దెలు(ఁ), గు[3]జోమయప్రియనీగణములుగొందఱురుద్రా.
అజముఖవరాహము[ఖులును], గజముఖమార్జాలముఖులు గణనాయకు లం
డజముఖులు వెండి యష్టాదు, నజామరుల కధికతేజు లాశ్చర్య లజా. ౩౬౨
గోముఖులు [4]వరాహముఖులు, సామజముఖు లుష్ట్రముఖులు సారంగముఖుల్
భీమవ్యాఘ్రముఖులు నా, నాముఖులు భవద్గణాధినాయకులు శివా. ౩౬౩
నానావర్ణసమేతులు, నానారూపధరు లర్ధనారీశ్వరు ల
శ్వాననమహిషాననసిం, హాననశరభాననులు గణాధిపులు [5]శివా. ౩౬౪
ముఖ[6]పాదులు పాదముఖుల్, ముఖకుక్షులు కుక్షిముఖులు ముఖహీనులు ష
ణ్ముఖపంచముఖచతుర్ముఖు, లఖండవిక్రములు నీగణాధిపులు శివా. ౩౬౫
ద్విముఖత్రిముఖగణాధిపు, లమేయ గుణు లుదుతరముఖసహస్రముఖు(లు)స
ప్తముఖాష్టముఖనవముఖద, శముఖులు నీకింకరులు విచారింప శివా. ౩౬౬
బాహుముఖులు ముఖబాహులు, బాహూదరు లుదరదీర్ఘబాహులు[7]గొంద(ఱ్)
బాహూరులూరుబాహు[8]ల, బాహులుబహుబాహులేకబాహులు ప్రమథుల్
బహువక్త్ర లేకవక్త్రులు,బహుదంష్ట్ర లదంష్ట్ర లధికబలసంపన్నుల్
బహునేత్రు లేకనేత్రులు, బహుకర్ణు లకర్ణు లెన్నఁ బ్రమథులు రుద్రా. ౩౬౮
బహు[9]జిహ్వ లేకజిహ్వులు, బహు[10]పాదు [లపాదు] లేకపాదులుగొంద(ఱ్)
బహుఘోణులు బహుమేఢ్రులు, బహురూపులు నీగణాధిపతులు కపర్దీ.
గణుతింపఁగ మ(ఱి)గొంద(ఱు), [11]గణపతులుఁ గపాలమాలికా[12]విషధరకం
కణచంద్రకళాభూషణు, లణిమాదిగుణాన్వితులు మహాత్ములు రుద్రా. ౩౭౦
పింగళకపర్ద[13]డమరుక, గంగాభసితాంగరాగఖట్వాంగధరుల్
భృంగిరిటిప్రియ నీగణ, పుంగవులు సమస్తలోకపూజితులు శివా. ౩౭౧

1. గణములజేయులు. 2. గజకర్ణులువరహకర్ణ. 3. జోమ్మయ్యప్రియ. 4. వరాహముఖులును. 5. రుద్రా. 6. పాదులుపాదముఖును. 7. కొందరుబహూరు. 8. లుబహుబాహు. 9. జిహ్వులేక. 10. లేకపాదులు. 11. గణపతులుంగొందరు గణపతులుంగపాల. 12. విసధర. 13. డమరుగ.

కంటకనరసింహశిరో, లుంటాకు లినేందువహ్నిలోచను లుగ్రుల్
ఘంటాకర్ణప్రియ ని, ష్కంటకులు భవద్గణాళిగౌరవ 1మహిమన్. ౩౨౨
నీలగ్రీవులు శుంభ, త్ఫాలా2భీలాక్షిదహనభస్మీకృతదు
శ్శీలత్రిపురమహాసుర, కోలాహలు లెన్న 3బ్రమథకుంజరులు శివా. ౩౨౩
త్ర్యక్షు భవద్గణనాయకు, 4లుక్షేంద్రారోహణులు 5మహోక్షపతాకుల్
దక్షాధ్వరవిధ్వంసులు, 6సాక్షాత్పరమార్థతత్త్వసమ్యగ్జ్ఞానుల్. ౩౨౪
కరినరసింహవ్యాఘ్రా, సురచర్మధరు ల్మహోగ్రశూలధరు ల్భీ
కరపన్నగేంద్రకంకణ, ధరులు భవద్గణము లధికదర్పితులు శివా. ౩౨౫
నారాయణాదిసురదను, జోరగమునిమానవేంద్రయూథసదాలో
కారాధ్యమానచరణాం, భోరుహులు గదయ్య ప్రమథ7పుంగవులు శివా.
చక్రాసహవిక్రములు త్రి, విక్రములు గపాలధరులు 8విధిమస్తకదా
మాక్రాంతోదరు లాజి, ప్రక్రమపాలనులు ప్రమథవర్గము రుద్రా. ౩౨౭
మురవైరిపంకజాసన, శిరోవిభేదకులు సకలశివధర్మవిదుల్
భరితజగదండరక్షా, పరాయణులు భూరిభుజులు ప్రమథులు రుద్రా. ౩౨౮
9ధరితశిఖండులు ముండులు, గురులఘువులుస్థూలసూక్ష్మకుంజరదీర్ఘుల్
పరికింపఁ గామరూపులు, హర కొంచ(కు)మీగణంబు లతిశాంతాత్ముల్.
నానానామాంకితులు స, దానందులు సాంబరులు దిగంబరులు మహో
దానవినోదులు ప్రముఖులు, నానాసురహరులు ప్రమథనాయకులు శివా.
వీరాచార్యాచార్యులు, వీరవ్రతవిదు లవార్యవిక్రములు మహా
వీరావతారు లసములు, వీరేశ్వర నీగణాళి విష్ణువరేణ్యా. ౩౩౧

సద్భక్తుల మహిమ.

స్వేచ్ఛాచారవినిష్ఠితు, లిచ్ఛావ్యాపారముక్తహృదయులు 10భవపా
శచ్ఛేదనకారణులు ద, యాచ్ఛాదితమనులు నీగణాధిపులు శివా. ౩౩౨
సర్వజ్ఞు[లు]సర్వగతులు, సర్వశుభోదయులు సర్వసంగత్యాగుల్
సర్వపరిపూర్ణు లెప్పుడు, సర్వేశ్వర నీగణములు శాశ్వతులు శివా. ౩౩౩
11గతవిధినిషేధలౌకిక, గతులు మహామతులు పరమకారుణ్య12లతా
కృతికరులు సకల[సు]గుణా, న్వితులు శివజ్ఞానరతులు నీప్రమథు లజా. ౩౩౪

---

1. మహిమముజా. 2. భీలాక్ష. 3. బ్రమథకుంజరుండు. 4. లుక్షేంద్రారోహనులు. 5. మహోక్షాపాతకుల్. 6. సత్యాత్మపరమార్థ. 7. కుంజరులు. 8. విధిమస్తకస్థామా. 9. దరితశిఖండులముండులు. 10. భవదాశాచ్ఛేదన. 11. తగవిధినెసగ. 12. లతాకృతకరులు.

అరుదుగఁ బురాణములలోఁ(c), బరువడి మును సెప్పియున్న భంగి గణాఢం
బరవిభవము వర్ణించితి, ధరణీధరవంద్య నాయథాశక్తి శివా. 3౮౫

## తన్ను గణములోఁ జేర్పుమని కవిప్రార్థన.

దేవా సంసారాంబుధి, లో వెలువడఁ జేసి ప్రమథలోకం బెఱుఁగక
నావాఁడు వీఁడు నుండీ, నావే[న] న్ను[ం]పవే గణంబులనడుమన్. 3౮౬
ఒండేమి మల్లికార్జున, పండితుఁ డన నుండుకంటెఁ బ్రమథులలో నె
న్నండొకొ నీయాజ్ఞో న్నతి, నుండఁగఁ గాంతు ననికోరుచుండుదు రుద్రా.
[1]పరమేశ్వర నీప్రమథుల, చరితలు సతతమును విన్నఁ జదివినఁ బ్రమథ
స్మరణము చేసిన శుభములు, దొరకొను దురితంబు లెల్లఁ దొలఁగు మహేశా.
దేవ భవదీయభక్తు లు, మావల్లభ[భ]క్తియోగ[2]మార్గమ్ములు నా
నావిధము [3]లందు రవియును, గోవిందాదులకు నె(ఱుఁ)గ గోచరమె శివా.
ఏభంగిఁ దలఁచు భక్తుం, డాభంగిన నీవు నెగడి యవిరళభక్తి
స్వాభావికత్వపరము, ప్రాభవవిభ[వ]మున నతనిఁ [4]బ్రణుతింతు శివా. 3౯౦

## కొందఱు భక్తుల చరిత్రములు.

తనుఁ గన్నతండ్రితల(c) దెగఁ, దునిమి భవద్భక్తియుక్తి ధూర్జటి యొకఁ డ
త్యనుపమగుణ[నీ]పదవికిఁ, జనఁడె ప్రసిద్ధంబు గాఁగఁ జండీశుఁ డజా. 3౯౧
[5]తనకన్ను పుచ్చి యొకఁ డ, త్యనుపమమాభక్తి [6]నీపదాంబుజములు నే
ర్పునఁ బూజించి సుదర్శన, మనుచక్రము [7]వడసెఁగాదె యచ్యుతుఁడు శివా.
శివనిందాశ్రవణము[నన్], [8]భవాని తనదేహ మాత్మపావకమునకున్
హవి సేసిగాదె భక్తిని, భవదర్ధాంగమున నుండఁబడసె మహేశా. 3౯3
శివనింద వింటి [9]నని ప్రా, ణవియోగాగ్ని[ని][10]యథాయణాధరుఁడైకా
దె విరాజిత[11]గణపదవికి, భువినెగడెను వ్యాఘ్రపాదపుత్రుఁడు రుద్రా. 3౯౪
దేవ నిను వీరభక్తిని, బోవక తనతలలు ద(ఱి)గి పూజించి వడిన్
రావణుఁడు చంద్రహాసము, దేవేంద్రజయంబు వడసె[ం]దె]ల్లముగాదే. 3౯౫
చేతులు రెండును దునిమి వు, హాతాత్పర్యమున [12]మిమ్ము నర్చిం[చి]జగ
త్పూతముగ మగుడఁ బడయఁడె, ఖ్యాతిగ నీచేత [13]భట్టబాణుఁడు రుద్రా.
గొ(ఱ)యలపాల్నిమీఁదను, నెఱయఁగఁ బిదుకు నెడఁ [ద]ండ్రినిష్ఠురుఁ డైనన్
మ(ఱి)వానిఁ జంపి నీవఱు, గొఱలఁడె గణపదవి(గా)టకోటఁడు రుద్రా.

---

1. ప్రమథేశ్వర. 2. మార్గములబలునా. 3. లంద్రవియును. 4. "బ్రతికింతు" అని యుండవలయునేమో. 5. తనుకన్ను. 6. పాదాంబుజ. 7. వడిసె. 8. భవానిఁదన. 9. ననిం బ్రా. 10. అర్థముచింత్యము. 11. గుణ. 12. నందునిమియర్చిజగ. 13. బట్టబాణుండు.

ఒకఁబకఁ గుమ్మగుండయ, వడి(ఁ) గడవలుచేసి చ(ఱ)చువాద్యములకు న
క్కడఁ బ్రీతి [1]నాడి తప్పడు, బెడ(ఁ) గడరఁగ నతనిభక్తి సెంపునకు శివా. ౭౧౧
[2]నరు లెల్లం జూడ నిజో, దరము ప్రవేశింపఁ గాదె తనకట్టిన[3]యుం
బర మొకమూరెఁడు దోఁపఁగ, నరియమరా జరిగె [4]ముక్తుఁడై నీకరుణన్.
భయముసెడి నిన్ను నమ్మిన, జయమునఁ దరియఁబడి నడను సాహసమున నీ
దయ నిండిపా(ఱు)నది దా, రయముడిగెను ముసిఁడిచౌండరాయనికి శివా.
తనుఁ గని మ్రొక్కిన "దీర్ఘా", యని పలికినపిదపఁ జచ్చె నాఁటది[5]తగునే
యనఁ బ్రాణమువడసెను వా, రనిదయతో ముసిఁడిచౌ[ం]డరాయఁడురుద్రా.
తనలంజయునుం జిల్కయు(ఁ), దన[6]లంజియబంధుజనులు దానును జనఁడే,
జనులెల్ల(ఁ)జూడ మలహణు, నిను సంస్తుతిచేసి దేవ నీపురమునకున్. [౭౧౨
వెలయఁగ[7]నాఁబోతులుఁదప, సులుమృతులై[8]యెదురురాఁగ(ఁ)జూచుచు(ఁ)బ్రా
బులువడయఁడె నీదయ నా, రలకప్పుడె ముసిఁడిచౌ[ం]డరాయఁడురుద్రా.
పెనిమిటి శివభక్తుఁడు గా(ఁ), డని యొల్లక రోసి నిన్ను నడిగిన రాత్రిన్
జనఁ బడసెఁగాదె శంకర, గొనకొనఁ [9]బుంస్త్వమ్ము నాఁడుఁగూఁతురు నీచేన్.
కెంబాగి బోగిదేవని, వెంబడిఁ జని నచ్చి పీడుపీఠంబుల లిం
గంబులు వడి [10]విప్రులు లీ, లం బొగడఁగ నిట్టినత్సలత్వము గలదే. ౭౧౩
విన్నపముసలిదియంబలి, మున్ననివేద్యంబు సూపి మ్రొక్కుచు నీకున్
సన్నుతభక్తిని మాదర, చెన్నయ నీకరుణ [11]ముక్తి చేకొనఁడె శివా. ౭౧౪
కూడి జగమెల్ల నోపక, [12]యాడినశివభక్తిమహిమ యుత్కృష్టముగా
[13]నేడర బంకయ చూడఁగ, దేడర దాసయకుఁ దలుపు [14]దెఱవవె రుద్రా.
శంకర నీకింకరుఁ డ, భ్రంకషముగ నేత్రవహ్ని(ఁ) బరదైవములన్
బొంక [15]మడఁగింపఁడే భువి, శంకరదాసయ్య నీప్రసాదమున శివా. ౭౧౫
[16]కడవఁగ సేరక మ్రొక్కిన, నడు [17]మప్పుడు వ్రస్సిపడ జినప్రతిమ నుహీన్
బడియందువైజకవ్వకుఁ, బొడసూపవె లింగమూర్తి(ఁ) [18]బురహరదయతోన్.
కడిచేసి పెట్టఁగాఁ గొని, సడిసనఁ గటకమున సురియచముఁడయగారిన్
గడు(ఁ) గరుణించి [19]జగమ్ములు, గెడఁగూడి నుతింప నారగింపవె రుద్రా.

---

1. నాతిదప్పడు. 2. నరుదెల్లంజూడరము. 3. యచుంబ్బర. 4. ముక్తుండే. 5. గనై యనంయనంబ్రాణముడడసె. 6. లంజయు. 7, నాబొంతులు. 8. యెదురాంగ, 9. బుస్త్వమాండుం. 10. విపులిలం. 11. భక్తి. 12. యాడిన. 13. నేడరబకయం. 14. దెలవెలె. 15, మడిగింప్పం. 16, కడవంగన సేరక. 17. మప్పడుస్సిపడజిన. 18. బురహరు. 19, జగ్గములు.

తన[1]గుఱ్ఱము సతులును బరి, జనులును దనతోడ రాఁగ శాశ్వతభక్తిన్
జని యెభపత్పురమునకు[ను], [2]గొనకొనఁగఁగొవమారపాలఘూర్జరుఁడుశివా.
గుడివడుగు డాఁచి కుంచియ, పొడసూపక తలుపు వెట్టిపోయిన నీ వ
ప్పుడె తలుపు దె(అ)చి భక్తికిఁ, బొడసూపవె కిన్నెరునకుఁ బురసంహారా.
కడుఁగడురౌద్రంబున జ[త], పడుమదకరి(ఁ)జంపి యపుడ [3]పడయుఁడె భువి ను
క్కడఁగియు బిజ్జలుఁ డడుగుడు, మడివలుమాచయ్య భక్తి [4]మహిలోఁ గలదే.
చోడని[5]యేనుఁగుఁ జంపుచు(ఁ), చోడనిశివభక్తిమహిమచొప్పడ నీచే
రూఢిగఁగ్రమ్మ(అ)ఁబడయుఁడె, [6]యోడకయిబుదత్తుఁడనఁగ నొకభక్తుఁడజా.
రావీధి యేచి యెక్కిన, మావంతునిఁ జంపి వచ్చు[7]మదకరి దనపై
[రా]వె(అ)చిమగుడఁ బా(అ)దె, బావురి[8]బ్రహ్మయకు నీప్రభావమున శివా.
భూతలమున నిది యంతయు, [9]నూతన మని పొగడ నేడునూ(ఱే)ండ్లు మనం
డే తనరుభక్తిఁ ద్రిపురా, రాతీ సకలేశు మాదిరాజయ్య శివా. ౭౭౨.
[10]ఎడపక పూజాంతమునన్, [11]చిడిముడిపడి ఘుర్ఘరములు సెలఁగఁగ నీ వె
వ్వుడు మెచ్చి భక్తి కాడుదు, వడిఁ జేమరచక్రవర్తి వాయింప శివా. ౭౭౩
నమ్మినభక్తుఁడుఁ గన్నడ, [12]బమ్మయసద్భక్తిమహిమ పరికింపఁగ లో
కమ్ములఁ జోద్యముగాదె య, ధమ్మంబును ధర్మమయ్యెఁ దత్త్వాతీతా.
పరువడి మ(ఱి)యు ననేకులు, ధర బాణమయూరకాళిదాసాదిమహా
పురుషులు [13]దృష్టప్రత్యయ, వరములు నినుఁగొలిచి కనిరి వరభక్తి శివా.
వలయునని దేవ[14]కొంద(అ), నెలకొని పేర్కొంటిఁ గాక నీచేత వర కున్.
మ్ములు వెలయఁగఁ బడసినభ, క్తులకొలఁదెఱుఁగుదుననంగఁ గొలఁదియె నా


భక్తిమహిమ.

[15]మహిలోఁ గేవలభక్తివి, రహితములై చేయఁబడికరంబును దుఃఖా
[16]వహమై దక్షుఁడు సేసిన, విహితక్రియ [17]లెట్టు లట్లవిఫలంబు లగున్.
నీపదభక్తుఁడు సేసిన, [పాపంబు]ంబుణ్యమగు[18]నభక్తులు సేయన్
[19]బాపమగుఁ బుణ్యమైనను, మాపతి [20]నీతలఁపె వేదమార్గం బయ్యెన్.
మొల్లల వైచినలక్ష్మి, వల్లభ[సుతుఁ [21]గాల్పవే యవారితవృత్తిన్
[22]మొల్లమిగ జాల వైచిన, యల్లగణాధిపున కీవె యపవర్గ మజా. ౭౭౯

1. గుఱము. 2. గొంకొనఁగ. 3. పడయుండె. 4. మహిమంగలదే. 5. యెనుగం. 6. వోడక. 7. మదకరిందనపై. 8. బ్రహ్మయ్యకుని. 9. నూంతన. 10. యడప. 11. చిమ ణిగ. 12. బ్రంహ్మాకు. 13. దంష్ట్ర. 14. కొందరు. 15. కావునం. 16. వహమయ్యె. 17. లెట్లట్లువిభవంబులగున్. 18. ను. 19. బాపమగుపుణ్య. 20. నీవలపె. 21. గొల్పవె. 22. మొల్లమురిజల.

కావున సకలక్రియలును, గేవలభక్తిప్రయుక్తికిని సరిగామిఁ

గేవలభక్తియ మేలని, గోవిందపరేణ్య [1]వరదుఁ గొలువవె శంభుఁ. ౨౫౦

వనజాసనవనజోదర, సనకాదుల కెఱుఁగరాని శాశ్వతమహిమన్

దనరినభక్తికి శంభుఁడు, నానరఁగ(ఁ) గడు మెచ్చి భక్తునొద్దన యుండున్.

ఈనిచ్చలుఁ గొనియాడెడు, నానావిధము లగు నిత్యనైమిత్తికక

ర్మానుష్ఠానము లొల్లఁడు, దా నెప్పుడుఁ గూర్చు శివుఁడు దనభక్తునకున్.

ఫలములు గుఱితిడి శివపూ, జలు చెప్పెడిచదువు లెల్ల శాశ్వతపదవిన్

వెలసిన కేవలభక్తి, [2]స్థలముల వర్ణించి చదునఁ [3]దద్దయుఁ దగునే. ౨౫౩

శ్రీలింగదేవుభక్తుల, కాలక్ష్మీ శాబ్జసంభవాదులపదవుల్

తూలాయమానములు స, ల్లీల శివానందసుఖవిలీనుల యగుటన్. ౨౫౪

కేవలము శివుఁడుఁ దనకుం, [4]గావలె నని గోరునట్టిఘనుఁ డెవ్వండే

గేవల మాత్రుఁడ తనకుం, [4]గావలె నని కోరు నట్టి కాంక్షున శివుఁడున్. ౨౫౫

ఇది విధినిషేధము[లు]గల, చదువులకును స్వామిభృత్యసంబంధమునం

బాదలిన కేవలభక్తికి, నాదసినకూటంబు గలదె యూహింపంగన్. ౨౫౬

ఫలియించు విధినిషేధం, బులవలనను బుణ్యపాపములుఁ దత్కర్మం

బుల నగు నయ్యై[5]లోకం, బులు భోగాంతమున మఱియుఁ [6]బుట్టుక కలుగున్.

కావున[ను] విధినిషేధవి, భావనుఁడై యుభయకర్మఫలవిరహితుఁడై

కేవలనిష్ఠ[ం] గొలుచుట, భావింపఁగ శుద్ధభక్తిపథము ధరిత్రిన్. ౨౫౮

పరమేశ్వరుఁ డగు శంభుఁడ, శరణం బని భక్తి [7]నమ్మి శంకరుఁ గొలువన్

దొరకొను భృత్యాచారము, సరియే పెఱమంత్రతంత్రజాలము లెల్లన్.

[8]విధి వే(ఱ)కలదె భక్తియ, [8]విధ విధిసహితముగ భక్తి[9]విరహితుఁడై తా

[8]విధియిందియశ్వమేధము, [8]విధిపుత్రుఁడు దక్షుఁడైనవిధ[10]మెఱుఁగరొకో.

[11]పృథువిధినిషేధలోక, [12]ప్రథితోభయకర్మరాశిఁ బ్రాపించెన్ నీ

[13]''పథపర్తిని తేషాయము, యథాతథా''యనుటఁ జేసి యంబారమునా.

[14]శివునకుఁ దనువును మనువును, శివభక్తులకును ధనంబుఁ జిత్తప్రీతిన్

భువి నిచ్చి యెల్లవారికి, శివుఁడను నేనవక యునికి శివభక్తి యగున్. ౨౬౨

1. వరుదు. 2. స్థలములు. 3. గద్దము. 4. గావలనని. 5. నయ్యైలోకంబుల. 6. బుట్టుగ. 7. నమి. 8. విది. 9. విరహితుండెతా. 10. యఱుంగరకా. 11. పృదు. 12. ప్రది: 13. పప. 14. దీనికిముందు ''శివునకుతనువును మనువులునకుందనువు మనవును' అను నసంపూర్ణార్థకవాక్యమొండు గలదు.

వెలుపలఁ గడిగిన లోపల(ఁ), గలచిత్తమలంబు వోవఁగా నేర్చునె ని
చ్చలుభావశుద్ధిఁ గడుని, ర్మలమతి శివుఁగొలువవలయు మానుగ భక్తిన్.
కత్తిఁ గొని కోసి దేహము, జొత్తిల్లఁగఁ గడిగినను విశుద్ధం బగునే
రిత్తలు దక్కిన శుద్ధుల్, చిత్తంబున శుద్ధి వలయు శివుఁ బూజింపన్. ౪౬౪
ఒడలఁ గలయవయవంబులు, [1]గడిగిన మఱివానిలోనఁ గడునిండిన చేఁ
దుడుగునె దేహము వెలుపల(ఁ), గడిగిన నదిచిత్తశుద్ధికారణ మగునే. ౪౬౫
అంతర్గతచిత్తంబ, త్యంతము దుష్ట మగునేని యది [2]మఱి ఘట[3]దృ
ష్టాంతగతి శుద్ధి యగునె న్ని, రంతరబహుపుణ్యతీర్థయాత్రాదులచేన్. ౪౬౬
సకలజగత్పతి యగుశివు, నికి భక్తులు [4]వీరు నాఁగ నెగడిన పుణ్యా
ధికులం దొండొకదుర్గుణ, శకలంబులు వెదకుపాపజాతులు గలరే. ౪౬౭
ఆతఁడు స్వరూపసుందరుఁ, డాతఁడె సౌభాగ్యవంతుఁ డాతఁడు గుణవి
ఖ్యాతయశోనిధి నీకుమ, హాతాత్పర్యమున భక్తుఁ డగువాఁడు శివా. ౪౬౮
ఆతఁడ జగత్పవిత్రుం, డాతఁడ [5]సంపత్సమృద్ధుఁ డాతఁడ యాహో
గ్యాతిశయాఢ్యుఁడు నీకు మ, హాతాత్పర్యమున భక్తుఁ డగువాఁడు శివా.
శివ[6]సంస్కారవిహీనుం, డవుమానవుఁ డంత్యజునకు నంత్యజుఁ డరయన్
శివసంస్కారనియుక్తుం, డవుమానవుఁ డగ్రజునకు నగ్రజుఁ డరయన్. ౪౭౦
మాలలఁ గులజులఁ జేయును, బోలఁగ శివభక్తులైన భువి నెఱుఁగరె మా
నీలగ్రీవుఁడు గులజుల, మాలలఁగాఁ జేయు భక్తి మది లేకున్నన్. ౪౭౧
చెన్నయ మాలఁడు గాఁడే, మున్ను మహాదేవుఁ గొలిచి ముక్తుం డయ్యెన్
జన్నమున శివుని దక్షుఁడు, మన్నింపమిఁ జేసి [7]పచ్చిమాలం డయ్యెన్. ౪౭౨
వేయేమి దొల్లి ముక్తికి(ఁ), బోయిరె విద్యలు[ను]వంశములు గలవారల్
బోయయు [8]సాలీఁడును మా, కాయజహరుఁ గొలిచిముక్తిఁ గాంచిరె గాదే.
వారనియమనియమములకు, ఘోరవ్రతములకు శివుఁడు గూర్పుఁడు శివనిం
దారతి విని తను విడిచిన, [9]గౌరీసతిభక్తియుక్తిఁ గనికూర్చుక్రియన్. ౪౭౪
జపములకుం దపములకును, నుపవాసంబులకుఁ గూర్పఁ [10]డుగ్రుఁడు నిందా
కుపితమతిఁ దన్ను విడిచిన, యుపమన్యుసభక్తియుక్తి కొడఁబడుపగిదిన్. ౪౭౫
కన్ను వడిఁ బుచ్చి పూన్చిన, వెన్నునిభక్తికి వరంబు వెదచల్లుక్రియన్
గన్నులు దె(అ)నకముందర, మిన్నక కూర్చున్న శివుఁడు మెచ్చునె వారిన్.

---

1. వెలుపలగడిగిన. 2. మటి. 3. దృష్టాంతర. 4. వీరువీరునాంగ. 5. సముండ్డుడా. 6. సంసార. 7. పచ్చ. 8. సాలీనుండు. 9. గౌరిపతి. 10. దుగ్రూరుండునిందా.

తనతండ్రిఁ దునిమి భక్తిం, దనరినచండీశ్వరునకుఁ దనయెంగిలి యి
చ్చినక్రియ శివుఁ[1]డిచ్చెనె పెఱ, జనులకుఁ గేవల[2]పదాన్యజనులకు నెందుల్.
మన్నించుఁ బ్రీతి నాదర, [3]చెన్నయభక్తియ [4]మనమునఁ జేకొనెఁ[5]గాదే
మిన్నక యంటనిముట్టని, చెన్న(ఁ)టివ్రతములకు నేల శివుఁ డెడఁగూర్చుల్.
[6]ప్రీతిమెయి వీరచోడన, భాతిగఁ గడియెత్తవె(ఱ)చి పనుచుఁడును రజ
స్సూతకి యని తొలఁగెనె స్పృహ, కేతనుఁ డాపులగ మారగించెడిచోటల్.
ఉన్నతభక్తి శిరంబులు, పన్నుగ శివుఁ బూన్చి కరుణ వడసినభంగిల్
ము న్నేవిధులం గొలిచియుఁ, జన్నదశానసుఁడు వడయఁజాలెనె చెపుమా.
తొల్లి శివుఁ గడవఁబలికిన, కల్లరిఁ దనతండ్రిఁ దునిమి కడుభక్తిమెయిల్
దెల్లమిగ ముక్తుఁ డయ్యెను, గొల్లఁడు గాఁడయ్య కాటకోటఁడు రుద్రా.
మును నవిసూచినకన్న, ప్పనియెంగిలి యారగించి భక్తిప్రధానం
బని కరుణించెను శంకరుఁ, డని విందుము విధులలోన నది యేవిధియో.
మ(ఱి)శివుఁడు భక్తిఁ గొడుకుం, ద(ఱి)గినచిఱుతొండనంబి దనవాఁడనుఁ[7]గా
కె(ఱు)ఁగక యేటికిఁ గారులు, మొఱగెడునీమంత్రతంత్రములు సేకొనునే.
కడుభక్తి నంబి పిలిచిన, నొడఁబడి యేయునినభంగి నొండొకవిధులల్
నొడువులు సెప్పిన [8]వ్రేళులు, మిడిచిన శివుఁ డట్టివారి మెచ్చునె చెపుఁడా.
ఆగమచర్యల కంత, ర్యాగబహిర్యాగవిధుల కభ్యాసమహా
[9]యోగమ్ములకుం బోయెనె, భోగన్నకు శివుఁడు వలచిపోయినభంగిల్.
అధ్యాత్మజులకుఁ బె(ఱ)మూ, ర్తిధ్యానంబులకు నితరదేవార్చనకుల్
విధ్యుక్తక్రియలకు సా, న్నిధ్యమగునె శివుఁడు [10]బాణునికిఁ గాక భువిల్.
నిష్ఠురభక్తి హలాయుధు, నిష్ఠకు వలచినవిధమున నీదగుకర్మా
నుష్ఠానములకు బిలబిలి, నిష్ఠలకును శివుఁడు వలచునే తలపోయల్. ౨౮౭
[11]మఱి విను మొరులవిధులకుం, గుఱియించెనె మెచ్చి లోకగురుఁ డీశుఁడు మా
కరికాలచోడనరపతి, గుఱుభక్తికిఁ బసిఁడివాన గురియించుక్రియల్. ౨౮౮
[12]స్నానములకు దానములకు, మౌనములకు హోమములకు మదిఁ జేకొనఁడీ
శానుఁడు నమ్మినభక్తికి, మానక* . . . . . . . ౨౮౯

1. డిచ్చిన. 2. పదాన. 3. చెన్నయ్య. 4. మనమునసుల్. 5. గాదే. 6. ప్రీతిమై.
7. గాకెఱుంగక. 8. వేళ్లు. 9. యోగముల. 10. మాణునను. 11. మరువినుమోరు. 12. స్థానములకు.
* శ్రీగురవేనమో శ్రీగురవేనమస్తే గురుమూర్తిప్రథితగుణాయ । శ్రీశంభవే నమో శ్రీశంభవే
నమస్తే శంభుసంచారచేతనాయ । శ్రీ శ్రీ జాయనమో—అని మూలమందుఁ జివరనున్నది. చివర
పద్యము పూర్తిగ లేదు.

# లఘు టీక.

(ఇందలియంకెలు శివతత్త్వసారమందలి కందపద్యములసంఖ్యలను దెలుపును.)

౫. నీమూర్త్యాత్ముల - శివుని యష్టమూర్తులను.

౧౪. షట్త్రింశత్పర్వోపరిగత - ముప్పదియాఱుమెట్లకుఁ బై నున్న. శైవసంప్రదాయము నందు, తత్త్వములు ౩౬. ఇవి యొకదానిపైనొకటి యుండును గనుక పర్వము (మెట్టు) లనఁబడెను. చివరది (నిర్వాణసోమ) రూపము. ౩౬ తత్త్వములు:—పృథివి, ప్రకృతి, బుద్ధి, అహంకారము, మనస్సు, శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, వాక్కు, పాణి, పాదము, పాయువు, గుహ్యము, శబ్దము, స్పర్శము, రసము, గంధము, ఆకాశము, వాయువు, వహ్ని, జలము, మాయ, కాలము, నియతి, కల, విద్య, రాగము, పురుష, సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్య, రూపము.

౧౫. దీనియర్థము చింత్యము. ఈతీరున దీనియర్థము కల్పింపవచ్చును. బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివు లనునైదుగురిని సాధారణముగఁ బంచకర్త లనివాడుదురు. (చూడు సంఖ్యార్థనామప్రకాశిక). మొదటి యిద్దఱైన బ్రహ్మ విష్ణువులకంటెఁ దరువాతివైన రుద్ర మహేశ్వర సదాశివరూపములు మూఁడును అధికమైనవి. ఈముగ్గురే నియామకారులు, ఆదిజగత్కర్తలు, అభ్యులు, అతిమహిమలు. మూఁడని అనుహత్తుగాఁ జెప్పినప్పుడు తత్త్వము లనియు, ముగ్వురని మహత్తుగఁ జెప్పినప్పుడు దైవములనియు నన్వయించుకొనవలయును. ఇంతియకాని ముగ్వురనఁగ బ్రహ్మ విష్ణు మహేశ్వరు లనఁబడు త్రిమూర్తు లని యర్థముచేసికొనుటకు వీలులేదు. వీలయిన బ్రహ్మవిష్ణువులు కర్తలు కారని ౭౯, ౮౦ పద్యములలో గ్రంథకర్తయే చెప్పియున్నాఁడు.

౨౩. i. అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహిమాన్ప - మాన్పఁబడునది పాశము, గనుక ఈసామాసికశబ్దము దానికి విశేషణముగ నుండవలయును. బద్ధపశు అనునది యిట్టి సమాస మని నాతాత్పర్యము. బద్ధాః పశవః యేనసః అని విగ్రహము. ఇది పాశమునకు విశేషణము. లేదా ఇట్టివియే మఱికొన్ని విశేషణముల నూహించుకొనవచ్చును.

అజ్ఞానితషష్ఠీతత్పురుషానూనసమాసము - పశూనాంపతిః పశుపతిః (షష్ఠీతత్పురుషము). పశుపతేరిదం పాశుపతం (పశుపతి + అణ్). పాశుపతవ్రతముచేత బద్ధపశుత్వవిశిష్టమైన ఐహికపాశము తెగునని భావము.

ii. సోమనాథభాష్యము (౧౮౮ ప్రకరణము) నందుఁ గొందఱు "పశుపతి" శబ్దమునే బహువ్రీహిసమాసముగఁ జెప్పెద రది తప్పు; షష్ఠీతత్పురుషసమాసార్థమే నిజము, అని చెప్పఁబడి యున్నది. కావున, పశవః, పతయః, యస్య, అనఁగా పశువులనఁబడు నితరదేవతలే శివునికిఁ బతులు అని వైష్ణవాదులు విపరీతార్థము చేసియుందురు. దానిని షష్ఠీతత్పురుషమే మాన్పును. అని యీపద్యమున కొక యర్థము చెప్పవచ్చును.

౨౭. బ్రహ్మోక్త - వేదములలోఁ జెప్పఁబడిన.

౩౨. ప్రమితి - యథార్థజ్ఞానము.

౩౫. శబ్దంబున - ఉపనిషద్వాక్యములవలన.

౪౩. మఱివెండి - మఱిమఱి.

౪౬. పానలు - సందేహము.

౫౪. గతశిఖాగాయత్రీయజ్ఞోపవీతనాస్తికులు - జుట్టును, గాయత్రీమంత్రమును, జందెమును వదలిననాస్తికులైనవా రని భావము. ఇది యద్వైతసన్న్యాసులను వెక్కిరించుట. లింగధారులలో సన్న్యాసులు లేరు.

౬౧. ఐశ్వర్యాద్వైతము - ఈశ్వరత్వమునకు సంబంధించిన అద్వైతము. తనకుసాటివాఁడు లేనందునఁ గలిగిన యనన్యభావము. అంటఱకుఁ దాను ఈశ్వరుఁ డగుటవలనను, తనకు సమానుఁడు కాని యధికుఁడు గాని లేనందునను, ఒక్కఁడు అని చెప్పఁబడెనేకాని జీవుఁడు ఈశ్వరుఁడు ఒక్కఁడను నర్థమందు కా దని భావము.

౬౬. మాయావాదులముందఱ - మా (శైవులైన) ఆ (ప్రఖ్యాతులైన) వాదులయెదుట.

౭౪. తత్త్వాధిపతి - దీనిని 'తత్త్వాధిపతి' యని దిద్దవలయును.

౯౪. పతి - యజమానుఁడు; సదృశ - సమానుఁడు; అధిక - ఎక్కువైనవాఁడు.

౯౬. నివృత్త్యాదికళాపంచకము - నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, శాంత్యతీతము అనునవి శైవులకళాపంచకము. (సంఖ్యార్థనామప్రకాశిక.)

౧౦౫. వసుసన యనలేదు - వసుస తప్పునంత నొకరతరువాత మఱియొకరు ముక్తికిఁ బోవలయు నన్నునియమము లేదు.

౧౧౪. 'మద్భక్తశ్చ శ్వపచో' యని మూలపాఠ ముండవచ్చును. పాలకుర్కి సోమనాథుని చతుర్వేదసారమునందు 'శ్వపచోపి మమప్రియో' (శివపురాణము), 'శ్వపచోలింగపూజకో' (స్కాందము), 'శ్వపచోపి మునిశ్రేష్ఠో యస్తు లింగార్చనే' అనిపురాణవచనము లుదాహరింపఁబడినవి. (౭౩-వ పద్యము).

౧౧౯. భూతిశాసనధరుఁడై - 'భూతిశాసనధరుఁడై' యని యుండవలయును.

౧.౨౧. అవిచారంబున - వెనుక ముందు చూడక, త్వరగ.

౧౩౩. వలచిన - సువాసనకొట్టిన.

౧౩౭. శివభక్తులనావారే - దీనిని 'శివభక్తులునావారే' అనిదిద్దవలెను.

౧౩౯. వరవుడు - దాసి.

౧౪౪. [శిష్యుఁడు] ఆడిన (మొదట) [తన] గురుఁడు [తనకు] కఱపిన వెరవున (విధముగ) చని (నడచుకొని, ఆచరించి), మీఁద (తరువాత) [ఆశిష్యునకు] భక్తి (శివభక్తి- ఎక్కుడుభక్తి) వేడించిన (పట్టుపడఁగా) [నతఁడు; తను (గురుపగుతనను)] గడచి చేసినన్ (భక్తియే ప్రధానముగ నెంచి గురువునాజ్ఞప్రకారము చేయక యన్యవిధముగ గొప్పభక్తుఁడై తనభక్తిని గనఁబఱిచినయెడల) అగ్గురుఁడు [ఆశిష్యునిమీఁదఁ గోపింపక తనశిష్యుఁ డంతవాఁ డాయెనని సంతోషించి] పరవశుండై భక్తుండన్నన్ మఱవవలయును.

౧౫౦. అనుదేహ - ప్రతిదేహ.

౧౬౩. వక్కండు - కృశింపఁడు, తగ్గఁడు.

౧౭౧. 'నమేభక్తాః ప్రణశ్యంతి' యనఁగ - దీనినిట్లు దిద్దవలెను. "'నమేభక్తః ప్రణశ్యతి' యనంగ."

౧౬౭. "బత్తళి" యనుకర్ణాటశబ్దము లేకుండ నీపద్యము నిట్లు దిద్దవచ్చును. క. క్షుత్తృ ష్ణాది[సమస్త]వి। పత్తులు జలతపన[శీత]బాధాది. ఇత్యాది.

౧౮౮. త్రొబ్బిన - పెఱికిన.

౧౯౪. శ్వపచునకుఁ గీడు=శ్వపచునకుఁ గ్రిందివాఁడు, మాలవానికంటెఁ దక్కువవాఁడు.

౧౯౫. పలమెత్తు ప్రత్తికిఁ గుల మంతయు నమ్ముడుపోయినకథ యేశైవపురాణమందైనను గలదేమో. పెరియపురాణములో - నొక భక్తుని కౌపీనముతో రాజు వైశ్వర్యమును గుటుంబమును సరితూఁగలేకపోయె నని కథ కలదు. దీనికి దాని కేమైన సంబంధము గలదా.

౧౯౬. ప్రత్త్వులు = పురుగులు.

౧౯౭. కొన్నిటినాళ్లుల్ - కొన్నినాళ్లు మట్టుకు. స్వల్పకాలమువఱకే యని భావము. మెఱయలక్రియ "మెఱియలక్రియ" నని దిద్దుకొనవలయును. మెఱియ యనఁగా గుంట్రాయి. దినవారములు చేయునపు డొక ఱాతియందుఁ బ్రేతనారోపించి దానిమీఁద నీళ్లు పోసి నువ్వులు దర్భలు మొదలయినవి వేసి, దానికే పిండములు పెట్టెదరు. అరాతివైభవము పదిదినములే. పిదప నుండదు. మీసముమీఁది మెదుకులమెరపుల్ - ఎట్లు క్షణభంగురములో - కొంచెముకాలము మీసముమీఁద నుండి తరువాత భోజనముచేసినవాఁడు ముఖము కడుగఁగనే జాఱిపోవునట్లే శివునిశ్రపలేని వైభవము లని భావము. ఇందు దృష్టాంతములు రెండు.

౧౯౯. పుట్టనిచచ్చిచానిపుట్టెదు = పుట్టినవి పుట్టినట్టుగనె లెక్క లేకుండఁ జచ్చుచున్నటువంటివి యని యర్థము స్ఫురించుచున్నది. ఈప్రయోగము చింత్యము. పుట్టనని చచ్చి, చానని పుట్టెఁడు - పురుగులు చచ్చునపుడు మరలఁ బుట్ట నని యనుకొనును. పుట్టునప్పుడు చావ నని తలఁచును. అనఁగాఁ బురుగులకు బ్రదికియున్నపుడు తమకొక్కప్పుడు తప్పక చావు గల దన్న జ్ఞానముండదు. చచ్చునపుడు పునర్జన్మ మున్నదను జ్ఞాన ముండదు. ఇట్లవి యేవిధమైన జ్ఞానము లేక మరలమరలఁ బుట్టుచుఁ జచ్చుచు నుండును. అట్లే శివభక్తిలేని మనుజులు మరల మరల జన్మమెత్తుచు ముక్తికి దూరముగ నుందురు.

పుట్టఁగని చచ్చి, చాఁగని పుట్టెదు - అనికాని, పుట్టఁగనెచచ్చి, చాఁగనెపుట్టి - అనికాని దిద్దవచ్చును. పుట్టిన కొలఁదికాలముననె చచ్చి చచ్చినకొలఁదికాలముననె పుట్టు నని యర్థము.

౨౦౦. రాజులు రట్టళ్లు = రాజులు రెడ్లు. 'రట్టడి'పదమునకు వాఙ్మయమునందుఁ బ్రచారము లేకపోయినను శాసనములలో నీశబ్దము విశేషముగఁ గానఁబడుచున్నది. రట్టడి, రడ్డి, రెడ్డి యను యీపదముయొక్క రూపవికాస మని తోఁచుచున్నది.

౨౦౨. మంత్రేయేనిన్ = బ్రతుకందలఁచితిరేని. మనుధాతువు.

౨౦౪. అలరి = దుష్టుఁడు.

౨౧౦. కుటిలాత్ముఁడు ధరియించు గోత్రము నెల్లం = ఇది తాటాకుగ్రంథములోనిపాఠము. జటిలాత్ముఁ డుద్ధరించు గోత్రము నెల్లం' అని యుండవలెను.

౨౧౫. అతగుల్ (బలహీనులు). శివుని కవిలియన్ (కవిలెకట్టుకు) ఎక్కుచురయ్య - అని నాల్గవపాదమున కన్వయము.

నిన్ను సేవింగిన నెట్టన శరణుండు, తన్ను సేవింగినఁ దాఘసుండు
నీవు తా నన్నను నిజము లింగైక్యుఁడు, తాను నీ వన్న సద్వైతవాది
కానఁ గాయకర్మగతిమతిశుద్ధ చై, తన్యభావములను దన్ను మఱచి
లింగగతిఁ జరించు లింగ లింగైక్యులఁ, జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు.

౨౬౦. అష్టాంగయోగము ప్రసిద్ధమె. షడంగయోగము పాశుపతులకు విశేషము. పాశు పతసూత్రమునం దిట్లు చెప్పఁబడి యున్నది:—'హసిత, గీత, నృత్య, హుడుక్కార, నమస్కార, జప్య, షడంగోపహారేణ ఉపతిష్ఠేతి' (సర్వదర్శనసంగ్రహము, నకులీశదర్శనము).

౨౬౧. శివయోగాఢ్యులో - అనిదిద్దవలయును.

౨౮౪. పశుసంతతి - పశుత్వమునకు సంబంధించిన సంతతి; శైవులు కానిసంతానము. శైవ గురువులసొత్తు వారిపుత్రులలో శైవు లైనవారికిఁ జెందవలయునే గాని శైవులుకానికొమాళ్లకుఁ జెందఁగూడ దను భావము గానవచ్చుచున్నది.

౨౯౨. పాదతి - అధముఁడు. ఈశబ్దమె శబ్దరత్నాకరమున పాదలి యని యున్నది. అందుకుఁ బ్రమాణము గౌరనరచితనవనాథోపాఖ్యానమునందలి "పాపపు విప్రుని పనికిఁ గా మున్ను, తాపికాఁ డైనపాదలిమంచడీఁడు" (భా. 3.) అను ద్విపద యీఁబడినది. కాని యిందలి 'లి'కారము ప్రాసస్థానమందుఁ గాని యతిస్థానమందుఁగాని లేదు. శివతత్త్వసార మందలి పద్యమున 'టి' కారము ప్రాసస్థానమునం దున్నది. కావున 'పాదటి' రూపమే సాధు వని యెంచవలయును.

౨౯౩. ముద్దటు లడచిన - పిడుకలు చఱచిన, వెంట్రుకలు వాదికొనిన - చిక్కుదీసికొన్నిన.

౨౯౪. అతకడచిన - అతిక్రమించిన, అగౌరవించిన; ఈయర్థమందె 'అతకరించు' అను ధాతువు కలదు.

౩౧౧. తారాజ్యేష్ఠుని - నక్షత్రములలో శ్రేష్ఠుని.

౩౨౦. నిర్వృతికి - సుఖమునకు.

౩౨౨. సమసుప్తినాథ-కల్పాంతరమందు దండఱును బోయెడు నిద్ర సమసుప్తి, దానికధిపతి.

౩౪౧. ప్రెయఃజా - ప్రేయుజా అనిదిద్దవలయును.

౩౪౬. జతలు - దీనిని 'జతులు' అని దిద్దవలయును. జతి, గతి యనునవి నాట్యసంగీత శాస్త్రములలోని పదములు "జతి" యనఁగా నాట్యయోగ్యతగల శబ్దసంతతి. (శబ్దరత్నాకరము) ఇది సంస్కృత యతిశబ్దమునుండి పుట్టినది. 'యతి' యనఁగా వాద్యాంగప్రబంధవిశేషము. 'గతి' యొక గమనవిశేషము.

౩౮౬. నావె - అనవె.

౪౦౨. అటిమెల్పడ - అటుమేల్పడ ననిదిద్ది మెడమీఁదినుండి పడునట్లుగా నని యర్థము చేసికొనవచ్చును.

౪౧౪. 'దీర్ఘా' యని - దీర్ఘాయు అని. ఇచ్చటి యనుకరణసంబంధమైన యుత్వసంధి చిం త్యము. లేదా, 'దీర్ఘా' యనునది పెద్దసంస్కృతవాక్యమందలి మొదటి రెండక్షరములే యని తలఁప వలయును.

౪౩౮. బెజ్జమహాదేవి - ఈమె నామ మీరూపముతోనే పెక్కు శైవగ్రంథములలోఁ గానవచ్చును. "మఱియును విను బెజ్జమహాదేవి యనఁగఁ । గఱకంఠశ్రీపాదకమలాంతరంగ" (బసవపురాణము ఆ. 3.)

౪౩౧-౩౨. పొసపోశై బండారువు బసవస - పొసపోరని బండారువు బసవన - ఈరెండు చోటులను 'పొసపరి యాబండారువు బసవన' యని యుండవలయునేమో. 'పొసపరి' అనఁగాఁ బట్టుపట్టి, ప్రతినచేసి యని సందర్భమును బట్టి యర్థ మిచ్చుచున్నది. బసవపురాణమునందు నీపదప్రయోగము గలదు. "పొసపరి పూన్యపరోక్షగలఁ దగిలి । భసితం బలంచని పాతకులార [ఆ. ౭.] "బసవయ్య యంత్రము లన్నుటఁ జేసి । పొసపరి మాతోడఁ బోరుచున్నారు [ఆ. ౭.]

ద్వి. దేవరదాసయ్య భావజాంతకుఁడ, శైవంబునుచు జైనలోకంబునూకె
పొసపరివత్రిల్లుపొల్లుచెప్పనను, పసతురేఁబ్బారుసను ప్రచ్ఛిన్నపించె.

పండితారాధ్య. వాసప్ర. పుట ౨౦౯.

౪౩౧ లో "బొసహొశై" యని మూలములో నున్నది.

౪౮౧. దీనియర్థము చింత్యము.

---

౩౫. తోఁచుచుండు - తోఁచుచుండ నని సవరింపవలయును.

౪౯. భువనభిన్నభావ - భువిన భిన్నభావ అని సవరింపవచ్చును.

౬౬. హరునికెవి - హార నీకెవి యనఁదగును.